శ్రీ

# పార్వతీపరిణయము

హరికథ



గ్రంథకర్త

శ్రీ రామకవచము అనంతశాస్త్రి

నారాయణపురము

నల్లగొండ జిల్లా.





గుంటూరు

చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రితము

1937

 [వెల 0-8-0

# పార్వతీపరిణయము

## హరికథ



గ్రంథకర్త

శ్రీరామకవచము అనంతశాస్త్రి

నారాయణపురము

నల్లగొండజిల్లా.

గుంటూరు చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రితము

ప్రథమముద్రణము

500 కాపీలు

19[illegible]7

 [వెల 0-8-0

# కృతిసమర్పణము



తే. గీ. సుతునిసంతాన మిలలోనఁ ♦ జూడనైతి
సనుచుఁ జింతింపవలదు నీ ♦ యాత్మయందు
తండ్రి ! కృతికన్య నీదు హ ♦ స్తముల నిడెద,
నింక లాలించుకొనుము శ్రీ ♦ కృష్ణయాఖ్య !

## పండితాభిప్రాయము

సీ. పద్యపద్యమ్మునఁ ♦ బ్రథితగీర్వాణవా
క్సంధానపరిచితి ♦ సందడించు
గద్యగద్యమ్మునఁ ♦ గమనీయవిషయస్వ
భావవర్ణనరీతి ♦ భాగ్య మమరు
గేయగేయమ్మునఁ ♦ గీర్తనీయలయప్ర
చారపూర్వకరాగ ♦ సరణి దేలు
భావభావమ్మునఁ ♦ బరమేశసత్కథా
స్మరణకృతోత్సాహ ♦ మహిమ దనరు
గీ. త్వద్రచితమాన్యపార్వతీ ♦ పరిణయాఖ్య
హరికథాకావ్య మానంద ♦ కరము సుమ్మ;
ఉరుయశోవ్యాప్తిఁ గనుత నీ ♦ యుద్యమమ్ము
అలఘుకవితాప్రశస్తి ! య ♦ నంతశాస్త్రి !

ఇట్లు,
జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి,
సహస్రావధాని.

శ్రీమజ్జగదంబాయై నమః.

# పీఠిక

—•—

పాఠకమహాశయులారా!

శ్రీపరమేశ్వరీ నిర్హేతుకానుగ్రహమున నాకుఁ బదునాల్గువత్సరముల ప్రాయముననే సాక్షాత్కరించినకవితాకన్య నూతనమైనది కాకపోయినను గ్రంథరచనమాత్రము నూతనమైనదని చెప్పక తప్పదు. ఆదినుండియుఁ జిల్లరపద్యములనో గేయములనో శక్తికొలఁదియల్లుచునే యుంటినిగాని ప్రస్తుతపరిస్థితులనుబట్టియు, నాతండ్రిగారియనుభవమునుబట్టియు నేపాత్రమును వ్రాయుటకు సాహసించనైతిని. పూర్వమునుండియుఁ గవిజనమునకు సామాన్యముగా నుండిన కృత్యాద్యవస్థలకన్న నిప్పటికృత్యనంతరావస్థలు గొప్పవని నాబోంట్లందఱెఱిఁగినవిషయమే. ఈవైరాగ్యభావముచేతనే దాదాపుగా నిరువదిరెండుసంవత్సరములవఱకు నేవిరో చిల్లరపద్యగీతాదుల నల్లి కవితాకన్య నోదార్చుకొనుచుంటిని. భావసంవత్సరాంతిమమాసములనుండి నామిత్రోత్తముఁడగు బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యదాసుగారి ప్రోత్సాహబలమున నాచే రచియింపఁబడిన నాలుగు హరికథారూపగ్రంథములలో నిదియె మొదటిదిగాన దీనినే మున్ముందు ప్రచురింప నెంచితిని. ఇయ్యది యువసంవత్సర చైత్ర శుక్ల ౧౪ నాడు దేవలమ్మ నాగవరగ్రామమున శ్రీరామచంద్రస్వామి యుత్సవసమయమునఁ బైదాసుగారిచేతనే ప్రవచనముసేయఁబడినది. వే॥ బ్ర॥ మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారా సభ కధ్యక్షత నంగీకరించి తదాస్థానమును మఱింత శోభింపఁజేసిరి. కథానంతరమున శ్రీరామచంద్రాలయకార్యనిర్వాహకసభ్యులచే దాసుగారికి బంగారుపతక మర్పించఁబడెను.

ఈవిధముగా నాకృషిని సఫలమొనర్చి కథాప్రవచనమునకు సౌకర్యములు సేకూర్చినతద్గ్రామయజమానులును, ఉత్సవాదికార్యధూర్వహులు నగు మ॥ రా॥ వరకాంతము లింగారెడ్డిగారికిని, తదాత్మజునకును, తత్సహోదరపుత్రులకును, దంగెళ్ళపల్లి గ్రామయజమానులగుమ॥రా॥ ముస్కు అనంతారెడ్డిగారికిని, తత్పుత్రత్రయమునకును నాకృతజ్ఞతలు దెలుపుచు వారిసాహాయ్యమును మఱవఁజాలను. మఱియుఁ గడునోపికతో నాగ్రంథములను విమర్శించి సదభిప్రాయము నిచ్చిన వే॥ బ్రి॥ జొధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి సహస్రావధానులుగారికిని దక్షిణామూర్తిశాస్త్రిగారికిని, సుబ్రహ్మణ్యదాసుగారికిని నాసర్వప్రయత్నములకు సర్వదా చేయూఁతనిచ్చుచుండు ఏలేశ్వరం వేంకటకృష్ణశాస్త్రిగారికిని నాయభివందనము లర్పించుచున్నాఁడ. పాఠకమహాశయులిందలిగుణములనే గ్రహించి యానందించి యాశీర్వదింతురుగాక. ఈనాచిన్నిపొత్తము సర్వజనసమాదరణమును బడసి చిరకీర్తి నొందుఁగాక యని శ్రీశ్రీ పరమేశ్వరిని బ్రార్థించువాఁడ.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు
శ్రీ॥ అనంతశాస్త్రి.





శ్రీ

శ్రీమజ్జగదంబాయై నమః.

# పార్వతీపరిణయము



## హరికథ



శా. శ్రీమాహేశ్వరిపాదపద్మముల నా ♦ చిత్తంబు సేవించుచున్
వేమాఱు ల్కరుణాకటాక్షముల నా ♦ విశ్వాంబ నన్జూచుచున్
సీమాతీతమహత్త్వసంపదలచేఁ ♦ జెన్నొందు నాతల్లి కే
యామాఱుం దలవంచి మ్రొక్కెద మదీ♦యేచ్ఛాఫలప్రాప్తికై.

క. ఏపనినైనను మిక్కిలి
ఓపికతోఁ జేయవలయు ♦ నోవిఘ్నేశా!
తేపకు నీకే మ్రొక్కెద
నోపికఁ జెడనీకు తప్పు ♦ లుంచకు తండ్రీ! 2

గీ. సరససంగీతసాహితీ ♦ స్తనయుగమున
దొరలునానందవిజ్ఞాన ♦ దుగ్ధములను
బోసి పెంచెద వోయమ్మ ♦ దాసజనులఁ
దనయులనుబోలె నీకు వం ♦ దనము వాణి! 3

—* గురుస్తుతి *—

సీ. దేహ మర్పింతునా ♦ దేహంబు నీయదే
కనిపెంచినాఁడవు ♦ గాన దండి!

గేహ మర్పింతునా ♦ గేహంబు నీయదే
యెన్నఁ డార్జించితో ♦ యింటిపెద్ద!
ప్రాణ మర్పింతునా ♦ ప్రాణంబు నీయదే
నీనిజౌషధముల ♦ నిలిచె వెజ్జ!
జ్ఞాన మర్పింతునా ♦ జ్ఞానంబు నీయదే
చెప్పి చెప్పించిన ♦ గొప్పయొజ్జ!

గీ. పాత్రవేళాప్రదేశముల్ ♦ పట్టుపడిమెఁ
గాని లే దెద్దియు న్నీది ♦ కాని దిందు
నక్షరజ్ఞానమనువుల ♦ భిక్ష మిడిన
ముఖ్యగురుఁడవు మునుముందు ♦ మ్రొక్కు లందు. 4

సీ. చెప్పినదే చెప్పు ♦ చిలుకపల్కులకు నెం
తో యుబ్బునల్పసం ♦ తుష్టులారా!
సరసరసాలవృ ♦ క్షములట్ల నానుఁడు
లరవాయిఁ గొననట్టి ♦ సరసులార!
గరళకంఠుఁడు సుధా ♦ కరునట్లు గుణము నే
గ్రహియించునట్టి స ♦ ర్వజ్ఞులార!
ఫలభారమునఁ దల ♦ ల్వంచి భూజములట్లు
కరుణఁజూపెడునుప ♦ కర్తలార!

ఆ. నీళ్లు మోసియైన ♦ నియతిమైఁ జరియించి
దుర్దినంబు లనక ♦ తోఁచినంత
యన్నపానవసతి ♦ నన్యులకుం జూపు
పూనిక వెలయుపుణ్య ♦ పురుషులార! 5

గీ. తెలిసి యొప్పులఁగూర్తునో ♦ తెలియకున్కి
తప్పులే వ్రాయుదునొ యింత ♦ చెప్పలేను;
ఒప్పులే చూచి తలయూఁచు ♦ నెప్పరులకుఁ
దప్పు లేటికి సాధువా ♦ దములుదక్క. 6

మ. ధనమే దైవము పత్నియే గురువు త ♦ త్తద్భోగ్యభోగాదులే
ఘనయోగాదులు పుత్రులే కరణముల్ ♦ గామాదులే మోక్షసా
ధనసంపత్తు లటంచుఁ బిమ్మట నిరా ♦ ధారుండవై పోకు ర
మ్మనుచుం బిల్చెదుజ్ఞానదేవతను మా ♦ యం జేయు మూఢుం డిలన్.

మ. భవబంధంబులఁ జిక్కి మానవుఁడు దు ♦ ర్వ్యాపారనిర్మగ్నతన్
శవమై భావభవాగ్నికీలలఁ దనం ♦ తన్ భస్మమై వెండియున్
వివిధాకారములన్ జనించుచు మదిన్ ♦ విజ్ఞానబీజంబు లే
క విమోహాంధువునందుఁ గూలునుగదా ♦ కామ్యగ్రహగ్రస్తుఁడై.

ఉ. జ్ఞాననిధానము న్వడసి ♦ కాదె మహామును లెల్ల మోక్షసం
ధానపథానుగాములయి ♦ తాపములం గడతేఱి రట్టివి
జ్ఞానమె మోక్షసాధనము ♦ గాని మఱొక్కటి గాదటంచు నెం
తేని వచించినా రనుభ ♦ వైకసుసిద్ధము లిట్టివాక్యముల్. 9

సీ. అజగర మేలాటి ♦ యత్నము లేసెను
సరఘులయత్నమే ♦ సరణిఁ బోయె
తండ్రు లార్జించిన ♦ ధనరాసు లెందేగెఁ
దనయులకే వచ్చె ♦ ధన మదెట్లు
పసిబిడ్డ మాయమై ♦ పాఱె నదేలొకో
కదలఁ డెందుకు మూఢు ♦ గాళ్ళముద్ద
భాగ్యవంతునికడ్డు ♦ పండ దదేలొకో
ముష్టివానికి బహు ♦ పుత్రు లేల
గీ. అరసి యిది యెల్ల నారబ్ధ ♦ మనుచుఁ దెలిసి
తెలివిమాలి యహంకృతు ♦ ల్నలుపఁబోక
అనుభవజ్ఞానసాధనా ♦ యత్తమైన
పరమనిర్వాణపదవినిఁ ♦ బడయవలయు. 10

గీ. మఱియు శాఖామృగంబట్లు ♦ తిరుగుచుండు
మానసంబు నిరోధింపఁ ♦ గా నుపాయ
మేదియును లేదు తత్త్వస ♦ మీక్షదక్క
గాన మానసమున కిట్లు ♦ గఱపవలయు. 11

కల్యాణి - చతురశ్ర

తెలిసి తెలిసి నిన్నుఁ - దెలియవా మానసా
ఫలశూన్యము యీ - జగదాభాసా
కలలోఁ గాంచినవెల్ల నిజములా
కలదే నీరు మరీచిక మనసా !
మి. అలశుక్తిం దోచురజతమున వల-యాకులఁ జేయఁగఁ జాలుదు వేభల
అలవికానిపని కాసఁజేయరాఁ - గలదె సుఖము వలదు వలదు
సత్యము ॥ తె॥
చ. పంచకోశముల పరిశీలనచే - నంచితాత్మనిత్యత్వముచే
సంచితార్థము లెవ్వనికో యో-చించి తెలియుమా యోమనసా!
మి. కించిద్జ్ఞవై యొందఁగాక నశి-యించి తిరిగి జన్మించి యాత్మనిటు
వంచించఁబోకు మాత్మానాత్మవి-వక్ష సేసి బ్రహ్మానంద మొందు॥ తె॥
క. ఈగతి నిజమును మదికి స
దా గఱపుచు నుండి విధివి ♦ ధానము లెల్లన్
దాఁ గావింపుచు ఫల మెం
దేఁ గోరక యున్న జ్ఞాన ♦ మిలఁ గల్గదొకో ! 13
సీ. జ్ఞానంబు నిత్యంబు ♦ జ్ఞానంబు సత్యంబు
జ్ఞానమేకద దివ్య ♦ సాధనంబు
జ్ఞాన మానందంబు ♦ జ్ఞాన మనంతంబు
జ్ఞానమే మోక్షని ♦ ధాన మరయ
అట్టిజ్ఞానంబు మా ♦ యాపరాభూతమై
మోహసాగరమున ♦ మునిఁగియుండు
నప్పు డజ్ఞానియై ♦ యంధుఁడై పురుషుండు
తన్నుఁ దాఁ దెలియక ♦ తప్పఁదోవఁ
గీ. బోవు నటుగాన విజ్ఞాన ♦ మును స్ఫురింపఁ
జేయ సంతతహరికథా ♦ మేయగేయ
ములను శ్రుతిపేయములుగాఁగ ♦ నలుపవలయు
ననుచుఁ జెప్పిరి పెద్ద లో ♦ యనఘులార ! 14

ఉ. కావునఁ బెద్ద లెన్నుకొను ♦ గాథలలో నొకపుణ్యగాథ మీ
కే వినిపింపఁగోరితి న ♦ దెట్లు పొసంగును శక్తి చిన్నదే
ఏవిధిఁ గాన నీశ్వరుఁ డ ♦ దెట్టుల నింపొనఁగూర్చునొక్కొ మే
ధావులు సత్స్వభావులు స ♦ దస్యులు మీర లనుగ్రహింపుఁడీ.

గీ. అట్లుమాశ్లేష మన్వర్థ ♦ మై చెలంగు
పార్వతీపరిణయ మను ♦ పూర్వగాథ
హరికథారూపమునఁ జెప్ప ♦ నగుచు బుణ్య
పురుషులార! యనంతసు ♦ ప్రోక్త మిదియ. 16



# కథాప్రారంభము



—* మంజరి *—

శ్రీమంతుం డబ్జాసనపుత్రుఁడు - చెలఁగుచుండు దక్షుండు
ధీమతి ప్రసూతి నాఁబరఁగినయువ - తిని బెండ్లాడె ఘనుండు
వేదశాస్త్రనిరతుండును బుద్ధిన్ - బృహస్పతికిఁ దుల్యుండు
వైదికాచారవర్తనశీలుఁడు - వదాన్యాగ్రగణ్యుండు
సంతతాగ్నిహోత్రి పాత్రితను బ్ర - హ్మాంతవాని సరి దీటు
సంతు తఱచు కలదుగాని మఱి యా - సంతానముతో పాటు.

సీ. ఏశక్తి భువనత్ర ♦ యీగర్భ సంచల
త్ప్రాణికోటుల కెల్లఁ ♦ బ్రాణశక్తి
ఏ తేజ మఖిలలో ♦ కైకభాసక మాచు
మొనయుచుండు నఖండ ♦ మూల తేజ
మేతల్లి లోకస్థ ♦ భూతజాలములను
గర్భమందున మోయు ♦ కన్నతల్లి

ఏరూప మీక్షింప ♦ నేరూప మనరాక
చెలఁగుచుండు నచింత్య ♦ చిత్స్వరూప
గీ. మట్టిదాదివ్య తేజంబు ♦ నాత్మజాత
గాఁగఁ బడసెను దక్షుని ♦ కర్మఫలము
నెన్న వశమానె వేయినో ♦ళ్ళున్నయట్టి
పన్నగేశునకైనను ♦ బ్రహ్మకైన. 18

గీ. అట్లు దక్షుండు భాగ్యభో ♦ గ్యముల చేత
ధనముచేతను సంతాన ♦ ధనముచేత
నీతిచేతను మిగుల వి ♦ ఖ్యాతిచేత
వెలయుచుండె జగన్మాత ♦ విధము వినుఁడు. 19

ఉ. దక్షునికూఁతురై పలువి ♦ ధంబుల ముద్దులుమూటగట్టుచున్
లక్షణధన్యయయ్యు మహి ♦ శామణియై సతినాఁ బరంగి ఫా
లాక్షు వరించెఁ దండ్రియును ♦ హర్షమునొందెను విప్రులంత మం
త్రాక్షత లిచ్చి వారిఁ గొని ♦ యాడిరి పాడిరి దేవగాయకుల్. 20

—* మంజరి *—

ఇట్లు లీశ్వరుని చెట్టఁబట్టి సతి - యెంతయు ముద మొప్పారెన్
గట్టువిల్తుఁ డల్లుఁడౌట దక్షుఁడు - గర్వమందు మితిమీఱెన్
కొంతకాల మిటు లేగినంత దక్షుఁడు - బ్రహ్మక్రతుశాలన్
పంతగించి కాలులఱచె రుద్రుఁడు - ప్రణుతిసేయఁడని చాలన్
తన్నుఁ జూచి యందరందు ప్రత్యు - త్థానాదులు సేయఁగను
కనికని శివుఁ డిట్లుపేక్షించెనని - కఱచుచుండె నోష్ఠమును
లోకాలోకన లేక యాత్మ నవ - లోకించెడుపరశివుని
ఈకరణిఁ గొప్పి కాలులఱచువాఁ - డేమగునోకద తుదిని. 21

ఆ. కొఱవితోడఁ దలను ♦ గోఁకికొన్నట్టు లా
కాలకాలుతోడఁ ♦ గాలుఁ ద్రివ్వి
కండకొవ్వునఁ బగఁ ♦ గలిగించుకొన్న యీ
దక్షుఁ డెట్టిపాట్లఁ ♦ దవులఁగలఁడొ. 22

క. వినుఁ డీ ట్లుండిన దక్షుఁడు
దనపుత్త్రికనైనఁ బిల్వఁ ♦ దలఁపఁడు మదిలో
దినములు మాసము లేండ్లును
జనుచుండఁగఁ జూచి యతని ♦ సతి యి ట్లనియెన్. 23

ఆనందభైరవి - త్రిపుట

నాథా! పిలిపింపవా యీ - నాటికైన నీకన్నబిడ్డను ॥నాథా॥
బాధగా నుండునుగాదా - పలుమా అనుచుంటిఁగాదా॥

మి. ఈధర నేతలిదండ్రిలు సుత - నిన్నినాళ్లు చూడక నిలుతురు
బోధపడదు యింతటికఠినతఁ - బూని తెట్లు నే నిల్వఁగఁజాలా ॥నా

చ. ఎన్నిపండుగ లెన్నిపర్వము - లెన్నిశుభములు జరుగుచుండె
కన్నపట్టిని బిలువకున్న - కంట నీరిడు మనసుఁ దలఁచి.

మి. ఉన్నవారిలోనం జిన్నది - యెన్నఁ డిట్లు రాకయున్నది
కన్నులఁగట్టినట్టు లున్నది-కన్నకడుపు దఱగుకొనుచున్నది॥నా

చ. ఆడుబిడ్డలఁ గన్నవారి క - హంకృతుల్ సెల్లఁగఁబోవునే
ఊడునే బ్రహ్మానుబంధము - కూడునే యల్లుని సాధింప.

మి. నాఁడు యేమిజరిగెనో పోనీ - నేడె పోయి కూఁతు నల్లునిఁ
దోడి తెందు మేఁడులు గడవం-గూడదనుచు పెద్ద లనుచునుండిరి॥నా.

సీ. ఈవిధం బ్రతిమాలు ♦ నింతిని దక్షుండు
కసరించి బెదరించి ♦ గ్రద్దఱించి
కోపించి విదిలించి ♦ కూడ వీమాటలు
పోపొమ్ము తిరిగి రాఁ ♦ బోకు మింక
పడఁతి నీబిడ్డలు ♦ పదునేవురే యని
మఱి కడచూలును ♦ మఱచిపొమ్ము
పుట్టి చచ్చెనో లేక ♦ పుట్టలేదో యని
తలఁచి నీమది దానిఁ ♦ దలఁప కింక

ఆ. ననుచు నిష్ఠురోక్తు ♦ లాడెడువిభుఁ జూచి
కనుల నీరుఁ గ్రుక్క ♦ కొనుచు నేమి

యనఁగ లేక పోయె ♦ నంత దక్షుం డొక
క్రతువు సేయఁ దలఁచి ♦ హితులఁ బిలిచి. 25

ఉ. యజ్ఞమొనర్తు నే శివున ♦ కాహుతుల న్సమర్పింతు వేడ్కతో
నాజ్ఞ యొసంగఁగావలయు ♦ నందఱు గార్యముపట్ల నామభా
వజ్ఞులరై చరించఁగల ♦ భారము మీతల నుండుఁ గావునన్
బ్రాజ్ఞులు మెచ్చఁగా యశమ♦పారముఁగాఁగను జూడుఁ డిత్తఱిన్.

మ. అను చెవ్వారికి నెట్లుసెప్పఁదగునో ♦ యవ్వారిగా వారి కా
పనులం జెప్పుచు విప్రవర్గనియత ♦ ప్రారంభవేళాపునః
పునరాశ్రావణసంభ్రమున్నిజహృద ♦ బ్జుండై విధానజ్ఞులా
మునులన్ బంధులఁ బిల్వ దూతలను వే♦పొండించుఁ బంపించినన్.

మంజరి

నలుఁదిక్కులఁజేని మునివరులకు వి - ప్రులకు దూత లిట్లనిరి
అలదక్షుఁడు యజ్ఞార్థము పిలిచెను - అంద ఱును రాఁగోరి
ఇలఁగలజన్నంబుల నిది క్రొత్తది - ఈశుఁ డిందు రాఁబోఁడు
తలపెట్టినయీకార్యభరము మీ - తలపైఁ బెట్టెను నేఁడు. 28

ఉ. మీరు సదారపుత్త్రిలయి ♦ మీప్రియశిష్యులు బంధుకోటు ల
వ్వారలమిత్త్రవర్గము ల ♦ వశ్యముగాఁ జనుదెంతురంచు న
వ్వారలచేత నెప్పు డేది ♦ వాంఛితమో యని యెల్లవస్తు ల
వ్వారిగఁ గూర్చి దక్షుఁ డిటు♦పంచెను మమ్ముల మీకుఁ దెల్పఁగన్

చ. అన విని మౌను లందఱు మ♦హాముద మొందఁగ నంతఁ గొంద ఱీ
శునియెడ సాపచారుఁడయి ♦ శ్రోత్రియశర్మకుఁ డైనయంత నే
ఘనమగు కిల్బిషానలముఁ ♦ గప్పునె ముప్పులు దప్పిపోవునే
కనికని పోవు టె ట్లతఁడు ♦ గర్వగదా తుది నేమిపుట్టునో ! 30

వచనము

అనుచుఁ గొంద ఱాయాగంబునకుఁ బోవెఱచి పోకయున్నను మఱికొంద ఱన్నిట సాటితేఱినవారు గావున దేనిని లెక్కఁగొనక కేవల కర్మకఠత్వంబు ముప్పిరిగొన వేదవేదాంగపారగులయ్యును,

ఆదిదేవునియెడ నపచారమొనర్చినవార మగుదుమేమో యన్నశంక నేవంకం గానక, పోఁజూచుచున్నవారిని వెనుదగులుకొని "పెద్దలతోడి వారముగదా యిందు మనలోప మేమియుండు" నని మనస్సును సమాధానపఱచుకొనుచు, మొండిగుండె గలవారై నడచుచున్న కొందఱిని జూచుచుఁ ద్రోవ లరయుచు, పోవుచున్నవారిం జూచి పోఁజూచునంత గుండె తటతటలాడ ఆశ ముందునకును అనుమానము వెనుకకును లాగుచుండ నొకరి నొకరు పురికొలుపుకొని మనమేమి యధ్వర్యులమా - బ్రహ్మలమా - హోతలమా - కేవలసూపోదనములకు భూరిసంభావనలకే కదా పోవుచుంటిమి. ఇంతలో నేమి మునింగిపోవు నని వారిలో వారిని మందలించుకొని - " హా - నడవరు - అయ్యో పొద్దాయె - లెండు లెం"డను పరస్పరాలాపంబు లెసఁగ నొకరినొకరు చూపించుకొనుచుఁ గనుసన్న చేసన్నలచేతను శిరఃకంపములచేతను ఒండొరుల యభిప్రాయములను గ్రహింపఁజాలక - వీమేమియో రహస్యము లాడుకొనియు - " ప్రశాంతాల కేమిలెండు - శుక్రిమసి సమృద్ధి - పరిషద్బాహుళ్యము-సరే ఆపోయాచా మిత్యాది వైదిక పరిభాష లాడుకొనుచు నడచుచున్న చిల్లర బ్రాహ్మణుల వెన్నంటి వృద్ధులు కొందఱు ఈశ్వరాపచారభీతియుఁ గుత్తులపైఁ బ్రీతియు మెండుకొన ననిష్టపరిహారార్థమై జాతవేదసేత్యాదిశ్రుతులం బఠియింపుచు - నరిగి నరిగి కించిద్దూరస్థగమ్యస్థానులై దక్షాధ్వరవాటం గనుమేర దూరమునఁ జూచి యుప్పొంగి గొంతులు సవరించుకొని నడికట్లు బిగియించుకొని శాలువలు సక్కపఱచుకొని తమతమశిష్యులం జేరంబిలుకొని పనస లందించుచుఁ జెప్పేడు చెప్పేడని, శ్రుతులం గలుపుకొని సంతలు సాగించి వల్లెల న్వేయించుచు నధ్వరశాలం బ్రవేశించి యచ్చటి ముఖద్వారమున లోపలి కేగి యం దమర్చియున్న వివిధయజ్ఞోపకరణంబులం దిలకించి ప్రాగ్వంశమును, ఆగ్నీధ్రశాలను, పత్నీశాలను సదస్యశాలయందలి బ్రాహ్మణబృందంబులం గని, యజమానశాలలో నున్నదక్షప్రజాపతిం జేరంజని నమస్కారమునకు మునుమున్నె యాశీర్వాదంబు లందించుచు వారిచేఁ దాము

బహూకృతులైనట్టు భావించుకొనుచు నుప్పొంగుచు భృగ్వాది ఋత్విగ్గణంబులకు నడుగక మున్నే తమతమ నామగోత్రాదు లెఱింగించుచు మహానసశాల కరిగి యచ్చటనున్న నానావిధపాక సామగ్రిలను శాకపాకాదులను వీక్షించి యొక్కయెడ విడిసి యచ్చట నదివఱకేయున్న నానాదేశాగతులైన బ్రాహ్మణులలోఁ బరిచితులైనవారి నడిగి క్రొత్తవారి సమాచారములఁ దెలిసికొనుచు - అనవసరప్రసంగములను, వ్యర్థప్రలాపములను, తెలిసి తెలియని లౌకికచర్యలను- తెగని వివాదములను, తగని ప్రతిపాదనములను లేనిపూర్వపక్షములనుకాని సిద్ధాంతములను, జేయుచున్నంత ఘంటానాదంబు వినవచ్చిన నది తమ్ము నధ్వరశాల కాహ్వానించుచున్నదని తెలిసికొని యంద అందేగి చూడ భృగుభగపూషాదముఖ్య ర్త్విక్కులచేఁ బరివేష్టింపఁబడి దక్షుండు వారు సెప్పినచొప్పున నగ్నిప్రతిష్ఠాపనాదివిధుల నిర్వర్తించి పిమ్మట నగ్నిముఖంబున స్వాహాకారంబుల నొక్కరొక్కరినిగా దేవతాగణంబుల నాయాదేవతాకమంత్రములచే నొక్క రుద్రదేవతాకమంత్రముమాత్ర ముచ్చరించక యాహ్వానించినంత నాదేవతలు వార్షించి విమానారూఢులై గుమిగూడి యాకాశమార్గంబునఁ జనుచున్న వారిం దిలకించి యచ్చెరువొంది సతీదేవి యిట్లనియె. 31

తోడి – రూపకము

బృందారకముఖ్యులార! - యెం దేగెదరు
సందియమయ్యెను దెలుపుఁడు - సంతసమును జేకూర్పుఁడు॥బృం॥
అందఱిట్లు గూడ నేల - తొందర పయనంబు లేల
ఇందుశేఖరుండుగూడ - విందుకు మీతోడ రాడ
మి. ఇందిరయును భాషాసతి - ఇంద్రపురంధ్రి మణియును
మందిరముల వీడి పతుల - కుం దోడై యే తెంతురే. ॥బృం॥
చ. ఏకార్యమునకుఁ బోయెద - రెవరు ప్రేష లిచ్చినారు
ఏ కేవల పుణ్యుఁడు మీ - కిష్టాన్నంబుల నిడునో.
చ. నాకాపురుషునివార్త వి - నంజెల్లిన మీ రిప్పుడు
సాకల్యముగాఁ జెప్పుఁడు - శ్రవణానందము గూర్పుఁడు ॥బృం॥

సీ. అనవుడు దక్షుండు ♦ యజ్ఞముం జేయుచు
నాహ్వానమును బంపె ♦ నాదరమునఁ
గావున జన్నంబుఁ ♦ గాంచి సత్కారంబు
లంది వేడుకతోడ ♦ విందు లందఁ
బోవుచున్నారమో ♦ పువ్వుఁబోఁడి తెలియవా
యాతఁడు నీతండ్రి ♦ యగును గాదె
బహుయజ్వ బహుదాత ♦ పరమ కర్మిష్ఠుండు
కాలయాపనసేయఁ ♦ జాల మింక
గీ. భువి ననాహూతులైనను ♦ సవనమునకు
నేగవలెనన్న యార్యోక్తి ♦ నెఱిఁగి కాదె
పోవఁగాఁ జూతు రెల్లవా ♦ రోవిశాల
నేత్రి యనిచెప్పఁ బతిఁజేరి ♦ యాత్రి మొప్ప. 33

కల్యాణి - రూపకము

మనవి వినుము ప్రాణనాథా - కనికరించు నామీఁద
వనితకోర్కెఁ దీర్చెదుపని - పతిదేకద భూతనాథ ॥మనవి॥
మి. అనితరవైభవముల మ - జ్జనకుఁడు జన్నమును సేయు
నని మునులును దేవతలును - జనుచుండిరి ముదమెసఁగను॥మనవి॥
చ. మనముగూడఁ బోవలదా మీ - మామగారి సవనముగద
మనను బిలువలే దనుకోనఁ - జను నే మనవారి మీఁద.
మి ననుఁబోలిన యాడుబిడ్డ - లనువుగఁ దమ పతులతోడ
మునుమున్నే చను దెంతురు-ననుఁగనుఁగొన వాంఛింతురు ॥మనవి॥

మంజరి.

ఈగతి వేడిన యిల్లాలిని గని - ఈశుఁడు దనలో నవ్వి
ఏగవలదు మనల నతఁడు మిక్కిలి - హీనులఁగాఁ గనుఁ గొ్రవ్వి
మునుబ్రహ్మలజన్నంపువాటికను - ననుఁ గని పేర్లిలుచునుండఁగ
గని పెద్దలు ఛీఛీయనుచుండఁగఁ - గలహమాడె నది యుండన్॥

ఉ. ఇప్పటికైన రాఁడు మది ♦ నెంతయు గర్వముఁబూనినాఁడు నా
తప్పులె యెన్నుచుండె నతి ♦ ధైర్యముతోడ నిరీశ్వరాధ్వరం
బిప్పుడు సేయనెంచె నిది ♦ యే తుదిగాదటె బాంధవంబు కో
రొప్పులకుప్ప యాతనిమ♦దోద్ధతిఁ గప్పెదఁ జూడు మాతయున్.

చ. కనికని యెట్లుపోవనగుఁ ♦ గాంతరొ యింత యెఱుంగలేవె నీ
జనకుని తుల్యపాటుగనఁ ♦ జాలనసహ్యముగాదె నీకు న
న్ననవరతంబు దూరునగ ♦ దా మనకేటికి కానిపొత్తు నే
విన నిటువంటిమాటలను ♦ బిల్వనిపేరఁట యెట్లుపోయెదో. 37

సీ. తరుణి ! నే నిచ్చిన ♦ తారకమంత్రంబు
చాలదే కోటియ ♦ జ్ఞంబు లేల
మన కున్న యీతపో ♦ ధనము చాలక యున్నె
తరలాక్షి ! లక్షల ♦ ధనమ దేల
ఎక్కి చరించ నీ ♦ యెద్దుండె చాలదే
అతివరో! వేలు వా ♦ హనము లేల
మనలఁ గొల్చెడి భక్త ♦ జనము చాలకయున్నె
పడతిరో ! శతసంఖ్య ♦ బంధు లేల

గీ. ఇహపరంబుల సౌఖ్యంబు ♦ లీయఁగలుగు
నిగ్రహానుగ్రహములందు ♦ నేర్పు గొలుపుఁ
గృషిభరోద్వాహనములందు ♦ నేపు సూపు
సేవనార్పణవిధులను ♦ జేయఁగలుగు. 38

మంజరి

అనవుడు దాక్షాయణి మది విన్నం - దనము దోపఁ దల వంచి
మనమునందు పలుచందంబుల నను - మానించియు చింతించి
తనవారలపైగల కూర్మిని సా - ర్థకము సేయఁగా నెంచి
వినయమొప్ప భర్తతోడననె నిజ - జనకుని తప్పు దలంచి. 39

సావేరి - రూపకము

నాథా ! మన్నింప భావ్యము - మనవారలుగదా ||నా||
సాధుమార్గచారుఁడవు - సకలధర్మరూపుఁడవు
క్రోధ మూన పాడియగున - కోమలపదకోకనద ||నా||
మి. ఈధర నినుఁబోలినదొర - నెందుఁగనము దయగనుము
బాధింపఁగఁ జూతురె తమ - వారల నెవ్వారలైన ||నా||
చ|| జనకునింటి మేలుగాన - చరణ మాటి వేసుదాన
అనుమతించి నన్నెన్ననను - బనుపుఁడు ముదమును గొలుపుఁడు.
మి|| పనిదీరినతోడనె యొక - దినమైనను నిలువఁబోక
చనుదెంచెద దేవర మృదు - చరణంబుల సేవించెద. ||నా||

సీ. అని బ్రతిమాలు ని ♦ ల్లాలి మాటకు శూలి
తనపాలి గృహలక్ష్మి ♦ తన్నుమాలి
పోఁజాలె నింకఁ గాఁ ♦ పురము గూలె నటంచు
మది నెంచి తలవంచి - మమత డించి
కానున్న కార్యము ♦ ల్గాక మానవుగదా
యని ధైర్యమును బూని ♦ కినుక మాని
పొమ్ము నీకర్మమ్ము ♦ పోవక తీరదు
నమ్ము మింతటితో బు ♦ ణమ్ము సెల్లు
ఆ. ననుచు నిష్ఠురోక్తు ♦ లాడిన నాసతి
భర్త యనుమతించి ♦ పంపినటుల
భావమందు నెంచి ♦ పయనంబు సాగించె
దైవగతుల నెవరు ♦ దప్పగలరు. 41

క. పతియనుగతి యనుమతి స
మ్మతి యేదియు లేక మాతృ ♦ మందిరమున కా
సతి పోవ వెంటఁ బోయిరి
హితమతి పార్షదులు నంది ♦ కేశుఁడు ప్రమథుల్. 42

ఆ. అంద ఱట్లు పోయి ♦ యడవులఁ బల్లెల
నదుల దాటి మఱియు ♦ నగము లెక్కి
దిగుచు నడిచి కొన్ని ♦ దినములలో దక్ష
యజ్ఞవాటిఁ జేరి ♦ రతిముదమున. 43

ఉ. అచ్చట నున్నబంధుజను ♦ లాప్తులు దక్షునివల్ల భీతిచే
వచ్చిన యాసతిన్ గని శు ♦ భంబులఁ బల్క రోకించుకేనియున్
మచ్చికఁజూపఁబోరు పలు ♦ మాట లిఁకేటికి నేత్రయుగ్మమున్
విచ్చియుఁ జూడనోడి రవి ♦ వేకు లథోగతిఁ బోవకుందురే. 44

గీ. తన్నుఁ జూచియుఁ జూడన ♦ ట్లున్నజనకు
చర్యఁ గన్నారఁజూచి చం ♦ చలితహృదయ
యగుచు నాథుఁడు పోవల - దన్నమాట
వినక యవమతి నవమతిఁ ♦ బెనిచితి ననిః 45

ఉ. జన్మముసేయరో జనులు ♦ సంపదలం దులతూఁగుచుండరో
మన్ననఁ బొందరో భువిని ♦ మానితకీర్తి గడించియుండరో
ఎన్నఁడు నెవ్వఁ డీకరణి ♦ హేయగతిం జరియించె నియ్యెడన్
గన్నులఁ గానఁడయ్యెఁ దన♦కన్నసుతన్ గనుఁగ్రొవ్వి యుండుటన్.

గీ. అనుచు లోలోనిపరితాప ♦ మును భరించ
లేక కన్నీరుఁ గార్చి య ♦ నేకగతుల
నేడ్చి యేడ్చియు నిట్టూర్పు ♦ లెగయుచుండ
సభ్యులను జూచి తలయూఁచి ♦ సాహసించి. 47

భైరవి - చతురశ్ర

కంటిరేకదా - ఓసభ్యులారా !
వింటిరేకదా పు - ట్టింటివిధంబును ॥కం॥
కంటికొవ్వుచేతఁ - గనఁ డీదక్షుఁడు-నా
వంటికూఁతుఁ గన్న - వార లీడ నున్న
మి॰ ఒంటిగనే - యీశ్వరుని
యింటికి నే వచ్చితి ము
క్కంటికి నే - నింటిదాన జంటదాన-హా ॥కం॥

చ. పిలువకున్నఁ గాని - పెద్దజన్న మని
తలఁచి తండ్రి యని - తారసిల్లితిని.

మి. వలదనఁగాఁ జెవిఁబెట్టక - కలికిని గా - వున నాపతి
వెలనెఱుఁగా-ఫల మిదెగా-గలిగెనుగా ॥కం॥ 48

ఉ. ఓమునులార ! నిర్జరకు ♦ లోత్తములార ! సదస్యులార ! యీ
భూమిని నిట్టిపాపములఁ ♦ బోయినవారలఁ గన్నవారొకో
పామరురాలైన నీగతికిఁ ♦ బాల్పడి రే సుత నిట్లు చూతురే
ఈమద మెట్టిదో గనుఁడి ♦ సీయిటచుండకుఁ డంచు ఖిన్నయై.

మ. అకటా ! యెంతటిసంకటం బొదవె నే ♦ నత్యంతనిర్భాగ్యనై
వికటేచ్ఛాపరిభూతనై చెడితి నా ♦ విశ్వేశుమర్యాద నిం
తకుమున్నే వికలంబొనర్చితి మహా ♦ దైన్యంబు సేకూరె హా
యిఁక నామో మెటుసూపుదుర్ శివుని కి♦స్సీ! యేటి కీప్రాణముల్.

శా. నే నీదక్షునికూఁతునై మనుటకం ♦ టెర్ దప్పు వేఱుండునే
నానాథుండును వాణి శ్రీసతియు నర్ ♦ 'దాక్షాయణీ'యండ్రుగా
దా ! నే నేమనిపల్కుదానఁ దలమె ♦ త్తర్ సిగ్గుగాదా ! మదిర్
నానాఁటర్ రవరవ్వలై సమయుటే ♦ నాజన్మ గాల్పంగనే. 51

మంజరి

అనితలపోయుచు దాక్షాయణి మదిఁ - దనపెనిమిటిని దలంచి
నిను సేవఁజేయ మఱియొకతనువుర్ - గొనెద దీని నిట డించి
జన్మ లెన్నియైన రాని నీకే - చరణదాసిఁ గాఁగలను
మన్మనోహరుండ ! నాదుతప్పుల - మన్నించఁగ వేఁడెదను
పాపాత్ముల కేప్రతీకారమును - జూపఁగ నెంచెదవో
ఏపగిదిని నావియోగదుఃఖము - నాపఁగ నెంచెదవో. 52

సీ. అనుచు నాసతి దండ్రి ♦ యాగాగ్నితోఁగూడఁ
దనదు యోగాగ్నిని ♦ దవులఁజేసి
పతివియోగాగ్నితో ♦ పాటు తత్క్రోధాగ్ని
ప్రజ్వలింపఁగ గట్టి ♦ ప్రీతిఁబట్టి

తనపరాభవ మను ♦ దావాగ్నితోఁగూడఁ
బంచాగ్ను లొక్కటఁ ♦ బ్రబలఁజేసి
వరుసఁబ్రాణానిల ♦ పంచకంబును దోడు
చేసి భూతము లైదు ♦ చేరియున్న

ఆ. ఆత్మదేహ మైదు ♦ నాహుతు లగునట్లు
చేసె దక్షువాటి ♦ శివునిబోటి
తనకుఁ గలిగియున్న ♦ దాక్షాయణీనామ
మాప్పఁ దలఁచి మదిని ♦ హరుని గొలిచి. 53

వచనము

అప్పుడు దుర్భరాగ్నిజ్వాల లావిర్భవించి, జగత్ప్రళయం బొనర్చునా యనుభయంకరావస్థం గలిగింప నచ్చటిసభ్యులును, దేవతాగణంబులును, మఱియు నానాదేశాగతజనంబులును హాహాకారంబులు సేయుచు నిశ్చేష్టులై పడియుండి నిర్జీవప్రతిమలో యనఁ దగి యుండఁ గొంతవఱకు రుద్రపార్షదులును బ్రమథగణంబులును గనులు విచ్చిచూడ జగ మంతయు నంధకారబంధురమై యుండ నేమియుం దోచక హరహరా! ఎంతకార్యము పుట్టె తల్లిలేనిపిల్లల మైతిమే. ఈశుం డీదుర్భరవియోగ మెట్లుభరించునో—ఈసమాచార మాచంద్రశేఖరున కెఱింగించుట యెట్లు. ఏ మొగముతో నాయయ్య మోముం జూడఁగలమని, పరితాపపడి యెట్టకేల కెట్టులో యాధూర్జటియెట్ట యెదుటం బడి భోరున శోకింపుచు బోరగిలంబడి, దేనినిఁ జెప్ప నోరాడక వెక్కి వెక్కి యేడ్చుచు "దిక్కులేనివార మైతిమిగదా. మాయమ్మ దక్షాధ్వరవాటిం దన్నెవ్వరు మందలించక యవమానించినకతంబున రోషపరవశయై భీష్మించి చిచ్చునంబడి భస్మావశిష్ట యయ్యె. మా కేగతిఁ జూపెదవో ఎట్టు లీమాతృశోకంబును బోఁజేసెదవో, ఎట్టులాయమ యవమానాగ్నిఁ జల్లార్చెదవో"యను దుఃఖాలాపంబులు సెవింబడ భవుఁడు గన్నులు దెఱచునంతఁ దోడన ఫాలనేత్రంబును దెఱచెనా యనునట్లు క్రోధాగ్నిజ్వాల లుప్పతిల్లి మహాప్రళయావస్థం జూపుచుండ దిక్కులదరునట్లును, దిగ్గజంబులకుఁ జెవుడులగునట్లును,

భూమి గడగడ వడంకున్నను, ఒక్క హుంకారం బొనర్చి, జటఁ బెఱికి భూమిపయిం గొట్టినంత దుర్భరస్తంభగర్భావిర్భూత వీరనృసింహోదయ వేళాసముత్పన్న భయంకరారావము ననుకరించుచు వేయిపిడుగు లొక్కటిమై పడుచున్నట్టు లొక్కభీషణారావంబు మునుమున్న బయలువెడలి తోడన భూమి భేదిల్లి యగాధకుహరం బేర్పడి యం దుండి దాక్షాయణీపరాభవోత్థిత క్రోధాగ్నిజ్వాలయో యనునట్టు లొక్కభయంకర తేజం బుదయించి కనులు చీకట్లు గ్రమ్ముచుండఁ గత్తిపాదలవంటి జడలును, చండ్రనిప్పులం బోలినగ్రుడ్లును, కులిశం బుల ననుకరించు కోఱలును, కొండగుహయో యనఁదగినకరాళవక్త్రం బును, అక్షమాలలును, ఫణిభూషలును వెలుఁగొంద శూలచాపగదా తోమరముసలాద్యాయుధంబులను ధరియించి, యనేకానుచరపరీ వృతుండయి యపరరుద్రుడో యనఁదగినవీరభద్రుం డుదయించి, రుద్రునకుఁ బ్రదక్షిణక్రియం బొనరించి నమస్కరించి, తదాజ్ఞంగొని వికటాట్టహాసంబులు సేయుచు దక్షయజ్ఞవాటిం బ్రవేశించి, హుంక రించుచు నిష్ఠురసింహనాదంబులు మిన్నుముట్ట ఉదగ్రదంష్ట్రాగ్రసంఘ ర్షణోత్క్షిప్తాగ్నికణంబుల జన్నంపుశాలల బూదిసేయుచు "శేశే దక్షా యెందుంటివి. భగా నిలు నిలువుము - పూషా పోకు పోకు" మను చొక్కరొక్కరిం బట్టికొని భృగుని మీసంబులఁ బెఱికి, పూషుని దం తంబుల రాల్చి, భగుని గ్రుడ్లు చిదిమి, మునుల బెదరించి దేవతలఁ జెదరఁగొట్టి యగ్నుల నార్చి యజ్ఞోపకరణంబులఁ బాఱవైచి పాకల సామగ్రిలం బాడుసేసి యాప్రదేశంబును శ్మశానతుల్యంబు గావించి యార్పుచుఁ దిరిగి వచ్చి మహేశునిం గలిసికొనునంతలో వీరభద్రు నిచేఁ బరాభూతులైన యింద్రాదిదేవతలు బ్రహ్మను బురస్కరించు కొని విష్ణుదేవునికడ కేఁగి మొఱ్ఱలిడ నాదేవదేవుండు బ్రహ్మాదులం గూడి కైలాసంబున కేతెంచి రుద్రుని వేవిధంబుల స్తుతియించి ప్రస న్నునిఁ గావించుకొని తదాజ్ఞానుసార మాదక్షునకు గొఱియతల నతికి బ్రతికించి భగునకుఁ గన్నులం బ్రసాదించి భృగునకు గొఱియమీసం బులం గట్టి యిట్లే తక్కినవారిఁ సవరించి యవశిష్టక్రతుఫలం బీశ్వ

రున కర్పించి, యజ్ఞముం బూర్తిసేయించి యెల్లవారు దమతమనివా సంబుల కరుగ నీశుండు బ్రహ్మచర్యంబుఁ బూని కైలాసంబునఁ దపం బొనరించుచుండె నంత. 54

మం జ రి

పూర్వచరిత మట్లు గడపి యాసతి - పునర్జన్మము న్వడసి
శర్వునిల్లు మెట్టఁదలఁచెఁ గావున - చలిమలభాగ్యము నరసి
అతనిభార్య మేనకాఖ్యఁ జెలఁగిన - సతిగర్భములోఁ జేరెన్
అతివ కంత గర్భచిహ్న లొదవెను - హర్షమంతటను మీరెన్.

సీ. ఆహార మింపుగా • దయ్యె మాంద్యం బయ్యెఁ
జూచుకంబుల నల్పు • సూడనయ్యె
మన్ను రుచ్యంబయ్యెఁ • గన్నులు బరువయ్యెఁ
గౌను దొడ్డదియయ్యెఁ • గష్ట మయ్యె
నొడలిలో మెఱుఁగయ్యె • నులుకు చాలగ నయ్యెఁ
బుల్లఁగూరలఁ దిన • బుద్ధియయ్యె
నోరూఱఁగా నయ్యె • మాటాడ వేసట
మెండయ్యె నడువలే • కుండ నయ్యె
గీ. అంతకంతకు భార మ • త్యధిక మయ్యెఁ
గ్రొత్తకోర్కులు మదిలోనఁ • గూడ నయ్యె
గట్టునాలికి వేవిళ్లు • గలుగు టయ్యె
మొదటితల్లికిఁ దల్లి గాఁ • బోవుటయ్యె. 56

క. నవమాసంబులు గడచెను
అవనీభృద్గోత్రపురంధ్రి • కంతటితోఁ బ్రా
సవికంపుఁజిన్నె లొదవెను
యువతీమణు లలరఁ బుత్రి • కోద్భవ మయ్యెన్. 57

గీ. బాలికామణి సూతికా • భవనమందుఁ
బెరుగుచుండెను నానాటఁ • బ్రీతిఁ బెనుపఁ
బర్వతపుఁబుత్రి గావునఁ • బార్వతియని
పేరువెట్టిరి వృద్ధలా • పేరఁటాండ్రు. 58

ఉ. పుట్టినవేళ నెట్టిగ్రహ ♦ ముల్ శుభమిచ్చెనో కాని బాలకున్
పుట్టినదాది తద్గృహము ♦ భూరివిభూతుల కాటపట్టువై
ముట్టినదెల్ల ముత్యమయి ♦ భోగపరంపరలం జెలంగె నే
పట్టున నేకాంత కను ♦ పట్టదు సుంతయుఁ గన్నవారికిన్. 59

సీ. కొన్నాళ్లు పొత్తిళ్ళఁ ♦ జెన్నారుచుండియు
నుయ్యాలం గొన్నినా ♦ ళ్లూగుచుండె
మోకాలుసేతులు ♦ మోపి తూఁగాడుచు
అంత కంతకుఁ దప్పు ♦ టడుగు లిడుచు
ముద్దులమూటల ♦ మురిపెంపుటాటలఁ
దియ్యనిపాటలఁ ♦ దేన లొలుక
బొమ్మలపెండ్లిండ్లు ♦ కమ్మనివంటలు
బిల్వార్చనంబులఁ ♦ బ్రీతి సలుపు

గీ. పూర్వవాసనచేత న ♦ పూర్వభక్తి
దినదినంబును విజ్ఞాన ♦ ఖనియు నగుచు
శైవనియతులఁ దీర్చుచు ♦ సంతసంబు
మెఱయఁ బుట్టింటిలో బాల ♦ పెరుగుచుండె. 60

—* మంజరి *—

ఈవిధిఁ బెంపొందుచుఁ దన కెనిమిది - యేఁడులు వచ్చినయంతన్
భావ మీశుసేవఁ జేయుచుంటకుఁ - బ్రీతినఁ బూనుకొన్నంతన్
భవుఁడు ధవుఁడుగాఁ గోరి ఘోరమగు - వ్రతమును జేయఁదలంచి
సవినయమున నిజజననీజనకుల - చరణములకుఁ దల వంచి
ఆజ్ఞ యొసఁగుఁ డేగెదనని కోరిక - నంతఁ దెల్ప దిగులొంది
ప్రాజ్ఞులయ్యు సుతఁ బాయలేక పరి- పరివిధముల మదిఁగుంది. 61

శా. అమ్మా యేటికి నిట్టివాంఛ మది నా ♦ హా చెల్లునే నీకుఁ బై
కొమ్మన్ బండినపండ్ల నందుటకుఁ గో♦ర్కుల్ సాగునే యేరికిన్
సమ్మోదంబున నింటనుండి బహుళై ♦ శ్వర్యంబులం బొందు మో
హమ్మున్ జెందక మీశ్వరుండు సులభుం♦డా యేటి కీకష్టముల్?

## శ్రీరాగము - త్రిపుట

మానుమా - మాయమ్మా యీ
మాట వినఁగఁ జాల మోయమ్మా ||మా||
కానన-భూములకు నేగి - కష్టములను బొందఁగ నేలా
మి. కానిపోనిపనులకు నీ విటు - కాంక్షసేయ నేలా-బాలా
మానితసౌఖ్యముల మాన పని-కూనా! నీ కగునా తగునా||మా||

చ. యోగులై స్వార్థసం - త్యాగులై యామహాభాగుని
వేగతుల న్వేడి వేడి - వేసటఁ బొందుచుందురు.
మి. భోగంబులకొఱ కాసచేసి - భూరిబాధలకు డాసి
యేగతి నీవామహేశునకు - నిల్లాలవు గాఁగలవు బేలవు ||మా||

ఉ. దేవత లెందఱో కలరు ♦ దివ్యవిభూతిఁ జెలంగువార లే
దేవతనైనఁ గోరఁదగుఁ ♦ దీక్షతపం బొనరింపఁజాలుదే
భావమునం దలంపుము త ♦ పంబన సాధ్యమె కోమలాంగివై
యేవిధిఁ గాయశోషణ స ♦ హింతువు తల్లి యరణ్యభూములన్.

సీ. అడుగు వెట్టఁగలేని ♦ యరుణాబ్జపాదవు
షట్పదాశ్రితపుష్ప ♦ సరణిఁగాని
చవిఁ జూడఁగాలేని ♦ సరసజిహ్వాగ్రవు
పక్వామరోర్వీజ ♦ ఫలముగాని
కంటఁ జూడఁగలేని ♦ కమలాయతాక్షివి
బాలభానుప్రభా ♦ పటలిఁగాని
చెయిఁ బెట్టఁగాలేని ♦ చిగురుకేల్దానవు
చందనోద్వర్తన ♦ మందుఁగాని

గీ. ఇట్టిదానవు శాలపై ♦ నెట్లు నడతు
వెట్లు లుపవాసదీక్ష స ♦ హింతు వమ్మ
ఆతపంబునఁ దప మెట్లు ♦ లాచరింతు
వమ్మ! సమిదగ్నికుశ లెట్లు - లందు దమ్మ! 65

సీ. వేవిధంబుల నిట్లు ♦ విలపించు తండ్రిని
నెట్టకేలకు నొప్పు ♦ నట్లుచేసి
తల్లి నట్టులె సమా ♦ ధానంబు గావించి
బంధుమిత్రులయాజ్ఞ ♦ వడసి తపసి
కన్నియవోలె వ ♦ ల్కలముల ధరియించి
కావివన్నియదట్టి ♦ కౌను జుట్టి
అక్షమాలికను గృ ♦ ష్ణాజినంబును బూని
పూనిక నడవికిఁ ♦ బోవ నెంచి

గీ. ఇల్లు వెడలఁగఁ దనవార ♦ లెల్లఁ జూచి
మదిని జాలియు నాశ్చర్య ♦ ముదము లెసఁగఁ
తోడఁ జని కొంతదూర మం ♦ తో ప్రియత్న
మున గృహమ్ములఁ జేరి ర ♦ మ్మదిత వీడి. 66

వచనము

అంత నబ్బాలికామణి దనవారల వీడుకొని యభీష్టసిద్ధికై యిష్టదేవతఁ వేడుకొని యత్యంతసుకుమారాంగియయ్యును మహాకార్యసిద్ధికి మిక్కిలి పాటుపడవలసినది గావున నంతరాయముల లెక్కసేయక గడుసుతాలకు జడియక కంటకజాలంబులకు జంకక గట్టులెక్కుచు దిగుచుఁ బల్లంబుల దాటుచు నెండవేడిమిని సరకుసేయక యిరుప్రక్కలం గలవృక్షంబుల నల్లిబిల్లిగా నల్లుకొనియున్న వల్లులందూటిపోవుచు గ్రిచ్చపొదలం దప్పుకొనుచు భయంకరమృగారవంబులు గుండె లవియఁ జేయుచున్నను నేమాత్రముం బెదరక చలిచీమల బారులం దాటుచు ముందరుగుచుఁ బరమాప్తుం డగుశంకరునితో - సప్తపదిం గోరునదిగావున నం దేకపది తనకు లభించినట్లుగా నలరి యొకయేకపదిం బడిపోవ నెంచి తన్ను మించినకామంచికుసు ల్లిరు దెసల నోలఁగి మార్గంబును గప్పియుంటచే వానిం దప్పించుకొని మార్గంబు నరయుచుఁ గొన్నికొన్ని చిన్నయేఱులను దమ కున్నయే కొలఁదిజీవనవసతికో మిన్నంటి కన్నుగానక తనహారిపరిమితిం దెలి

యక, యున్నతపదంబుల కెక్కి దిగజారెడు దూరస్థబంధుసంతతులను వలె దాటిపోవుచు నాఁడు రెండుయామములకే మూఁడామడలు నడచి ముందున్నయొక్కపల్లియం దిలకించి చేరంజేని, యందందుఁ జెట్లనీడల రక్షాతంత్రపరికల్పితము లైనవనమాలికలు భుజపత్రనియంత్రితములై సన్నని నారత్రాళ్లతోఁ గట్టఁబడియున్న మొలత్రాడులలోఁ బిల్లనగ్రోవులం దోపుకొని ప్రియముచేతనేగాక సంప్రదాయముచేతఁగూడ నేమాయ లెఱుంగక సహజవైఖరిని వచ్చియు రాని గ్రామ్యభాషల నాడుకొనుచుఁ జిఱ్ఱగోలలు, గోలీలు, దాగుడుమూఁతలు మేక పెద్దపులి మొదలగునాటల నాడుకొనుచున్న భిల్లజాతిపిల్లకాయలను, మఱియు బాలురయాటలం జూచి యేమేమియో యనుకొనుచు నవ్వుకొనుచుఁ జెట్లకొమ్మల వ్రేలాడఁగట్టియున్న దూసరతీఁగలయుయ్యేలల నూఁగుచున్న నవయస్కలైన బాలికలం జూచి యలరి యావలం బోనెంచుచున్నప్పు డచ్చటిభిల్లనాయకు లీ బాలికం జూచి యచ్చెరువంది యెవ్వరో తెలియఁగోరియు నడుగఁ జాలక యడుగులంబడి యాతిథ్యమొసంగి చెట్టునీడన్ విశ్రమింపఁజేసి, దోసిళ్ళనిండ దూసరివేపుడుబియ్యమును దియ్యనివనఫలంబులను దీసికొనివచ్చి ముందుఁ బెట్టినఁ గొన్నిటిమాత్ర మాహరించి నీరాని సేదదేరి, వారల బహూకరించి యొకయామమాత్ర మచ్చట గడిపి పిమ్మట నటవీమార్గంబుఁ బట్టిపోవుచుఁ గొంతమేరం జని మార్గంబు గానక తడఁబడియు ధైర్యంబు వహించి నడచుచున్నప్పుడు తీక్ష్ణకంటకంబులు దీర్ఘకాలశత్రువులవలెఁ బాదంబులం గస్సునఁ గ్రుచ్చుకొని యసృగ్ధారల వెడలఁజేయఁ దీవ్రాతపంబుచే నొడలాపాదమస్తకము వేడిమెక్కి చెమ్మటలుగ్రమ్మ నాలుక దడియాఱి నీ రెండునం గానక తల్లడిల్లుచు మనస్సునం దేలాటిమార్పును గలుగనీక కొంతవడి మెల్లగా నడచుచుండ సూర్యాస్తమయసమయం బాసన్నంబగుడు నొక్కయెడ స్వతంత్రజీవనాధారములు గలభాగ్యవంతులను జారిణులవలె నొకదానిపై నొకటిగా వచ్చి చుట్టుకొనియున్న లతామతల్లుల కాశ్రయ మిచ్చియు శీలంబులం జెడనీక పరిగ్రహానుకూలఫలసంతతి నీయఁ

గలిగిన ఫలవృక్షములం జూచి నవ్వుచు, మిమ్ముఁ జూడనివారిం గను మఱుగనిచ్చి లభ్యఫలసంపత్తిని భూమిం బాతిపెట్టుకొని స్వవంశాభివృద్ధిఁ గోరుచు స్వార్థపరత్వమునఁ దవిలియుంట యేగొప్పతనము? మమ్ముఁ జూడనివా రున్నతావులకుఁ దావులం బంపి యాతిథ్యమిచ్చి పిలిచి పరిమళసంపత్తిని బూలలోఁ బెట్టి యొప్పగింపఁజాలుదుమే యని పరిహసించుపూలచెట్ల నెకసక్కెము లాడుచుఁ బొదువులం బోవుట గొప్పఁదనమా, ఈయకున్నఁ బండ్లు రాలఁగొట్టెద రన్నశంకచే ఫలవృక్షములును గావులే యెగిరిపోవునన్నభీతిచే మీరును అంగసౌష్ఠవం బేమాత్రముం జెడనీయక యల్పత్యాగంబుఁ జూపుట లెక్కయే; యున్నసర్వస్వము నేకాక సమయమువచ్చిన మూలధనమునుగూడ ద్రవ్వికొననిచ్చెదమే యనుచున్నపచ్చికకుదుళ్ళ నపోహామపోహమ్మని మీకీజాతివైషమ్య మేల స్వీయవర్గములందే సామరస్యము లేదే తమ్ముల నెట్లు భరియింతు రనుచు లోతులం గప్పుకొని గాంభీర్యముం జూపుచున్న చల్లని నదీజలముం దాడుచుఁ బాహుపఁ జిఱుచేపలం బట్టియు హింసించక నొడ్డునం బెట్టనవి జలముం దెగిరిపడుటఁ గని యానందించు జలపక్షులకుఁ బైనుండి ఱెక్కలు సాచి నీడనిచ్చు డేగల కందుబాటుగాఁ గ్రిందినుండి తీయనిపండ్లను రుచిచూచి యెగురవైచుచున్న శాఖామృగంబుల భుజములపై నెక్కించుకొని చెట్లకొమ్మలనుండి స్రవించుమధుబిందువులఁ జవిఁజూపు నెలుఁగుబంట్ల యొడలివెండ్రుకల చిక్కుఁదీయ నేతెంచు వ్యాఘ్రంబుల నఖంబులం జిక్కుకొనులేఁతపచ్చికలను జూచి పరువులెత్తివచ్చుచున్న లేడిపిల్లలఁ వీక్షించి యయ్యది మహాత్ము లగుఋషులయాశ్రమభూమి యని గ్రహియించి ముందుకు నడిచి యందున్న మౌనులకు సాష్టాంగపడ నందఱు కరుణార్ద్రహృదయులై యాశీర్వదించుసంత నొకవృద్ధతపస్వి యిట్లనియె. 67

ఉ. ఎవ్వనిబిడ్డవమ్మ యిటు ♦ లెచ్చటి కేగెదవమ్మ యొంటిమై
పువ్వునకన్న మార్దవముఁ ♦ బొందెను నీయొడ లెంచిచూడ నో

యవ్వరొ యెట్టికోర్కె హృదయంబునఁ గల్గెను జెప్పుమమ్మ పో
నెవ్వగ గల్గునమ్మ యిది • నిశ్చయ మిచ్చట నుండుమా యనన్.

బిలహరి – ఖండజాతి.

జితక్రోధ మునినాథా – చెప్పెద నాగాథా
హితమతిన్ వినఁదగును – సతతనిర్గతభేదా ॥జిత॥

మి. శ్రుతపూర్వుఁడు మీకున్ – గతకల్మషుఁ డెన్నన్
స్తుతచరితుఁడు హిమవం – తుఁడు నాతండ్రి యగున్ ॥జిత॥
ఏను భవుఁ జేపట్టఁగా – నేగుదును గాన
కాని యేవ్రతవిధిని – గానఁ గల్గుదు నతని

మి. మానుగ నావిధుల స – మస్తము వినఁగోరెద
నీనులఁ బడసేయుఁడు – వేడుక లొనగూర్పుఁడు. ॥జిత॥

మంజరి

అన విని మునివరుఁ డాగామిని దన – యాంతరదృష్టిం జూచి
ఘనకేశునిపూజాఫల మీభా – మిని యని తనలోఁ దలఁచి
శివుఁడు వరుఁడు గాఁగలఁడు తపంబును – జేయుచుండు మమ్మాయి
దివిజు లంద ఱీకార్యమునకు య – త్నించెద రెంతయు తోడయి
వ్రతవిధానములఁ దెలియఁగోరితివి – వాలాయము వినఁదగును
కతిపయదినంబు లుండు మిచట స – క్రమపద్ధతు లలవడును. 70

ద్విపద

అని యిట్లు కొన్నినా – ళ్ళచ్చట నిలిపి
మునివరుఁ డాయమ – ముచ్చట ల్వినుచు
యమనియమంబుల – సంతతం దెలిపి
క్రమముగా నాసన – క్రమములం గఱపి
పీడపఁ బ్రాణాయామ – విధి నెఱిఁగించి
మదిని బ్రత్యాహార – మార్గంబు నతికి

ధ్యానధారణములఁ - దగ సమాధులను
పూనికతోఁ దెల్పఁ - బూఁబోఁడి యంత
కతిపయదినములం - గడపె నచ్చోట
నతివకు నొకరేయి - యం దీశ్వరుండు
కలలోన వచ్చి య - క్షరపంచకంబు
తెలియఁగాఁ జెప్పి య - దృశ్యుఁడై సంత
వేగ మేల్కాంచి నిత్య - విధులెల్లఁ దీర్చి
ఆగట్టురాపట్టి - యాస్వప్నవిధము
మునితోడఁ జెప్ప స - మ్మోదంబు నొంది
వనితరో నీ వింక - వని కేగవచ్చు
నని యర్చనాదిస - మ్యగ్విధానముల
వినుమని చెప్ప నీ - విధి నొప్పుమీఱ. 71

శంకరాభరణము - త్రిపుట

ఫాలనేత్రు నుపాసించువిధిని - బాగుగాఁ దెల్పెదనే తల్లీ
బాలరో యామహానుభావుఁడు - భక్తిసులభుం డని నమ్ముము.
మి॥ లోలత నేమాత్రింబును మదిఁ - గ్రాల నీకు భీతిల్లకుము
కాలకంధరుని పదయుగముల - కనులనుండి నెడసేయకు మెప్పుడు
చ. కొమ్మరో ముమ్మారు సంజలఁ - గుంకులాడు చలినీటఁ
నెమ్మది నేపూట కాపూట నీ - నిత్యనియతులఁ దీర్చుచుండుము
మి. ఉమ్మలికముఁ జెందకు మెయ్యెడ - నుపవాసము లభ్యసింపుము
ఇమ్ముగ యమనియమాదులయెడ-నేమాత్రము ప్రాలుమాలఁ
బోకుము ॥ఫా॥
చ. వేసవిఁ బంచాగ్నుల నొక్క - వేయిప్రాణాయామములను
జేసి పిదపఁ బంచాక్షరీమంత్రి - సిద్ధికై పదివేలు జపించుము
మి॥ వాసిగ శీతర్తువులయందు - వాయుమాత్రపారణవై నిది
ధ్యాసతోడఁ గంఠదఘ్నతో - యముల నుండ భవుఁడు నిన్ను
జేరును ॥ఫాల॥

క. ఈ నియమంబుల విని తన
మానసమున నలరి యచటి ♦ మ్మౌనితతికిఁ దా
నానతు లొనరింపఁగఁ గని
మానుగ దీవించి రపుడు ♦ మాన్యచరిత్రన్. 73

క. వని కేగ సెలవు గైకొని
చని బిల్వాటవిని జేరి ♦ సంతస మెసఁగన్
గనుగొని నిర్మలజలముల
ననువగునని గిరిజ తపము ♦ నారంభించెన్. 74

సీ. ఒకచోటు సరసి ని ♦ మ్మోన్నతంబుల బాగు
పఱచి కుశాజినాం ♦ బరము లుంచి
ఒకయెడ శుష్కేంధ ♦ నకుశాదులను గ్రిమ
క్రమముగాఁ గట్టలు - గట్టిపెట్టి
ఒకవంక సతతాగ్ని ♦ హోత్రి ముంచుటకునై
లోతుగా నొకచిన్న ♦ గోఁతిఁ ద్రివ్వి
ఒకచాయ నేకబి ♦ ల్వోర్విజము న్నాటి
నాలుగంచులతిన్నె ♦ నోలి వేసి
గీ. మఱియు నొకదండఁ జల్లని ♦ తరువునీడ
నర్ఘ్యపాద్యాదులును దియ్య ♦ నైనఫలము
లుంచి యాశువ కాతిథ్య ♦ మొసఁగ నెంచి
తపము సాగించె శివునిపైఁ ♦ దలఁపుఁ బెంచె. 75

అనుదిన మరుణోదయమున స్నానం - బాచరించి శుచి యగును
మనమునందు నీశుమంత్రరాజం - బును పఠించు ముందుగను.
పిదప నగ్నులను జూచు వృక్షముల - నుదకంబులచేఁ దనుపున్
సదయయగుచు మృగశాబములకుఁ బ చ్చనిగఱికలఁ దినఁగఱపున్
అంత యోగ మభ్యసించుఁ బ్రాణా - యామములను హెచ్చించు
శాంతమొప్ప భవుఁడొసఁగిన పంచా - క్షరాల మఱి జపియించు
పిమ్మట మానసపూజ సేయుఁ గను - దమ్మిదోయి ముకుళించి
సమ్మతి నొకకాల నిలిచి యిటు ధ్యా♦నమ్ము సేయుఁ దల వంచి॥

(దండకము)

శ్రీమన్మహాదేవ దివ్యప్రభావా శుభంభావుకార్థప్రదానప్రవీణా భవాతీతసత్యాత్మనిత్యస్వరూపా మహానందరూపా మహానందికేశా నయానప్రధానా మహాపాపహంతా మహాతాపనిర్వాపదుర్వారకోపానలాటోప శాపాయుధత్రాణసంతానకాష్ఠావసానా విమానాభియానానుకూలాతివేలాదరోదారభావాలవాలా కలాపూర్ణనిర్ణిద్రభద్రంకరా దుష్టనాశంకరా శిష్టపోషంకరా "శంకరాహం భవత్కింకరీ మాం కృపాయత్తదృష్ట్యా సమాలోకయన్ పాహి" యంచున్ నినున్ వేడుచుంటిన్ మదిన్ నమ్మికొంటిన్ మదీయప్రపంచంబు ప్రాణంబు మానంబు చిత్తంబు విత్తంబు నీవే ప్రమాణంబు నీవే ప్రమోదంబు నీవే ప్రధానంబు నీవే నిధానంబు నీవే ప్రసాదంబు లేకుండ నీలో ననుంగూర్చుకోవే భవానీ మృడానీ యటంచు న్ననుం బిల్వఁగాఁ జేయు మోదేవ నీమెద్దు నెక్కించుకోవే మఱి న్నీదు దేహార్ధ మీయంగదే రాజచూడామణీ దివ్యతేజోమణీ భక్తచింతామణీ తే నమస్తే నమస్తే నమః

మ. ఇటు బిల్వాటవి నానగాత్మజ భవుం ♦ డే భర్త గాఁగోరి యు
త్కటనిష్ఠన్ దపియించుచుండె భవుఁడో ♦ కైలాసమం దుండి యె
ప్పటికిన్ దీరనిబ్రహ్మచర్యవిధినే ♦ పాటించె నీద్వంద్వసం
కటమున్ దీర్పఁగ బ్రహ్మఁజేరి యిటు లా ♦ క్రందించి రింద్రాదులున్.

ధన్యాసి - ఆట

భాషాసతీశా - పాపాచలకులిశా ॥భాషా॥
పోషితభువన సం - తోషితనిజదాసా
శేషశయననాభికు - శేశయసంభూత
భూషితసద్గుణ - పూతా స్వయంభూత

చ. శోషితాంతర్మోహసాగర - శోధితాతతతత్వసుపథా
భాషితశ్రుతిజాతభూత - ప్రకరకారణసత్యశపథా

చ॰ కనుము మమ్ములను గై - కొనుము మొక్కులను
వినుము మామనవి యొక - ఘనకార్య మొదవెను
మి॰ మును సతీమణి యజ్ఞవాటిక౯ - దనశరీరము వీడి హిమవం
తునికి౯ బుత్రిక యయ్యె బిల్వ - వనమునం దపియించుచున్నది.
చ॰ ఆవేడి భరియింప నలవిగాదు మమ్ము -
గావ౦జూడకున్న గతియేమి చతురాస్య
మి. మా వెంట వచ్చి గనుమా - మానవతి పంచాగ్నులందున
నేవిధంబుగ నుండెనో హరు-డెమగ౦డు గావలయునట యో ॥భా

సీ. అనవుడు నాకమ ♦ లాసనుం డిట్లను
సురలార ! శంభు౦డు ♦ సులభు౦ డయ్యె
ఆనా౦టనుండి బ్ర ♦ హ్మానుసంధానంబు౦
జేయుచున్నా౦ డెట్టి ♦ చింత లేక
కను విచ్చి చూడ౦ డే ♦ కరణి మాటాడుడు
నైన౦ గొండొకయుపా ♦ యంబు గలదు
విను౦ డాభవుని చిత్త ♦ వృత్తిని మఱలింప
మారుం డొక౦డు దక్క ♦ శౌరినైన౦
గీ. జాల౦ డటుగాన వాని ♦ నే లీల నైన౦
బంపుదురయేని గార్యమై ♦ వచ్చు దాని
యనుచు౦ జెప్పిన దేవత ♦ లతని వేడ
నియ్యకొని చే ఱెఱుంగక ♦ యేగ౦ దల౦చి. 80

మంజరి

మీనకేతను౦డు సపరికరుండై - పూనికతో నిల్వెడలి
ధీనిధి యగునీశునికడ కేగి మ - దిని భీతిని బోదోలి
ఐదువిధములగు సూనశరమ్ముల - నన్నిటి నొక్కట౦ దొడిగెగా
ఆదిదేవుగుఱిచేసి వేయ నవి - యతనిశిరమునం దాగె
నారితోడనే తెగియు దుమ్ము లెగ - బాఱి విరులపై వ్రాలె
సార మేది ధనువు తుంటలయ్యెను - జాహ్నవి జెండా గూలె.

మాధవుండు శత్రుఁజేరె మున్నె - మామయుఁ దలపై నెక్కఁగ
క్రోధ మొందు ఫణులు చల్లగాలిని - గొఱుకక పైపై మెక్కఁగ
చేవఁ జెదిరి మొగిలిపూవు బాఱఁగ - జేఁతఁబట్టె నామరుఁడు
ఆవిరిని ముట్టఁబోఁడు గావున - నట్టెకాదభ్రమున హరుఁడు. 81

క. మూడవకంటం జూచిన
తోడనె కాముండు నగ్ని • దొర్లినవిధమై
బూడిదగాఁ గని తత్సతి
వాడినకనుదోయి యుష్ణ - వారిం దొఱఁగఁగ. 82

(ఫీలు) - (చతురశ్రి)

ఆగఁజాలను - ఈ దుఃఖ మిం ॥కాగ॥
ఆగమవినుత - ఆదిదేవ నే ॥నాగ॥
ఏగతిఁ బోవుదు - నెవ్వరి వేడుదు
నాగతిఁ గానవా - ననుఁ గాపాడవ
భోగము లెడపితి - పురుషుని గెడపితి -
నాగభూషా వి - యోగముఁగూర్చితి
మి. సాగునెట్లు నాదినము లింక నో - సాధుజనావన సత్యాచారా
యోగినివలె నే నేదేశములకు - నేగుదాన నన్నెంతజేసితివి ॥ఆగ॥
చ. మఱచితివానను - వరమిచ్చితిమును - "పరమసుమంగలీ-భవ" యని యనియును
సరగుననాపతి-సమయఁజేసితివి -హరహర నీవాక్యము దప్పెదువే
మి. పరమపురుష పసుపుకుంకుమలఁ గా - పాడుమయ్య కానున్న వాఁడ వీటు
వరసాధ్వి యుసురుఁ బంచుకొనకు మో - ఫాలాక్ష వందనము సేతు నే ॥నాగ॥ 83

మ ం జ రి

ఇటు విలపించెడు కామునిసతిఁ గని - ఈశ్వరుండు యోజించి
పటుతరముగ మున్నిచ్చినట్టి దీ - వన మదిలోనఁ దలంచి

భావికార్యముల దివ్యదృష్టికర - బదరాభముగా నెఱిఁగి
కేవలకరుణారసపూరిత దీ - ర్ఘికలలోన మది గరఁగి
హాయికల్గు నోయమ వాపోవకు - మనుచు వేయివిధములను
ఆయమ నోదార్చుచును బల్కె శ్రుతి-పేయము లగువాక్కులను

సీ. అడలకు నీమగం ♦ డగ్గిపాలయ్యెను
విధివిధానంబు ద ♦ ప్పింపఁగలవె
దాన నీమైదువ ♦ తనము పోవఁగఁబోదు
నావాక్య మన్యథా ♦ నడవరాదు
ఆరహస్యంబు య ♦ థార్థంబుగా నీకుఁ
జెప్పెద విను శాంత ♦ చిత్త వగుచు
నుండుమా ద్వారక ♦ నుద్భవించు నితండు
ప్రద్యుమ్నుఁడని పిల్వఁ - బడుచు నుండు

గీ. రుక్మిణీకేశవులకుఁ బు ♦ త్రుం డనంగఁ
బరఁగు నాతఁడు యౌవన ♦ వంతుఁ డగుచు
నిన్నుఁ జేపట్టునందాఁక ♦ మిన్నకుండు
మఱియు వినఁదగు నిందొక్క ♦ మాట గలదు. 85

చ. అసురుఁ డొకండు శంబరుఁ డ ♦ హర్నిశముం గనిపెట్టియుండి రా
క్షసకృతమాయచే శిశువుఁ ♦ జంపఁగ యత్నముసేయుఁగాని యే
దెసలను హానిరాదు వన ♦ ధిం బడవైచిన వాని నంతనే
మసలక చేప మ్రింగు నది ♦ మత్కృతమై నినుఁ జేరు కోమలీ.

ఉ. కావున శంబరాసురని ♦ కాయ్యమునందున వంటలక్కవై
వేవిధులన్ విధానముల ♦ వింతగఁ జేయుచు మెప్పు లొందుమా
దైవవశంబునన్ ఝషము ♦ దప్పక నీకు లభించు నందునన్
జేవఁ జెలంగుబాలుఁ గని ♦ చేయుము పోషణముం దదాజ్ఞచేన్.

గీ. అంత నాతఁడు యౌవన ♦ వంతుఁ డగుచు
రక్కసుం గూల్చి నిన్ను గా ♦ రవ మెసంగ
ద్వారకన్ జేర్చి సౌఖ్యము ♦ ల్వడయు ననుచుఁ
జెప్పె నాసతి యటు సేసెఁ ♦ జింతఁ బాసె. 88

## మం జ రి

అటులఁ దీక్షతప మాచరించునా - యద్రితనూభవ మదిని
నిటలాక్షుఁడు దయ సూపఁడామె న-క్కట యని దూఱుచు విధిని
పరిపరివిధములఁ జింతింపుచు గత - వత్సరముల లెక్కించి
కరకంఠాయని సంబోధించుచుఁ - గనుల నశ్రువుల నించి. 89

సీ. పెద్దకాలంబయ్యెఁ ♦ బ్రేమతో నీశుని
గాంచుభాగ్యము నాకుఁ ♦ గలుగదయ్యె
తపముల జపముల ♦ నుపవాసనియతులఁ
దపియించితిని గోర్కి ♦ దవిలి తవిలి
కరుణార్ద్రహృదయుండు ♦ కాలకంధరుఁ డంచుఁ
గొనియాడుదురు ♦ భక్తకోటు లెల్ల
నావిధి విపరీత ♦ మై వచ్చె నది యేమి
కారణమో పూర్వ ♦ కర్మ మేమొ

గీ. కాంతునిం గాంచుయోగ్యత ♦ గలుగ దేమొ
ప్రియునిపరిచర్య నాకు ల ♦ భించ దేమొ
కోరియున్నట్టి కోరిక ♦ గూడ దేమొ
భార్యగాఁ జేసి నన్నుఁ గా ♦ పాడఁ డేమొ. 90

మ. వని కేతెంచెడివేళ సన్మునులు నా ♦ పైఁ బ్రేమచేఁ బల్కి రో
యనవద్యాంగి సమీహితార్థము నవ ♦ శ్యం బందె దోయమ్మయం
చని రామాటయు వ్యర్థమై తఁౘరె నా ♦ హా యెట్టి నిర్భాగ్యనో
యనఘా ! దీనశరణ్యా ! పాహి యనఁ గు-య్యాలించవా యేలవా.

## నాథనామక్రియ - త్రిపుట

కనికర మింతయైనఁ - గలుగదాయెనా యో
కాలకంఠా - కైలాసనివాస
దినము లేగుచునుండె - నెనిమిదేడులు నిండె
కనులఁ జూడ వైతివి - గట్టి దారా నీగుండె

మి. వనులంబడి నీకొఱకై నే - బడిబడి పదునిదుములఁ జూడా
మన సెట్లుసహించె ప్రోడా - మఱిమఱి నీ కిదియే క్రీడా.

చ. తలిదండ్రులను బాసి - పలుసుఖంబులను రోసి
ఇలను నాదైవమ వని - తలంచియుంటిని గాని
పిలిచినఁ బలుకవైతివి - తలంచిన దయఁజూడ వైతివి
సులభసాధ్యుఁడ వని - సూక్తు లంతట విని
ము. కలలోఁ గనుపెన్నిధానమును - గైకొంటకు వెఱ్ఱిదానిఁ
బలెనైతిని జూడఁజూడ - నాధ నామక్రియ యిదియే. ॥కని॥
చ. పరమకృపామయుండవని ♦ పల్కుదు రెల్లమునీంద్రు లెప్పు డే
కరణి గడించినాఁడవో సు ♦ ఖంబున వర్తిలి యిట్టికీర్తి నో
హర! యటుకాక పోయిన య ♦ థార్థములాడరొ మానిబృందముల్
సరగునఁ దెల్పు మిప్పటికి ♦ శంకరర్త మఱి మార్చుకొంటివో
చ. నను నిటు గాసిఁబెట్టుదువె ♦ నాథ! యనాథశరణ్య! నాదు నె
మ్మనమున బాల్యమాది నిను ♦ మామకభర్త వటంచు నమ్మి కా
ననమునఁ జేరి యిట్టికఠి ♦ నశ్రమ లొందినఁ జూడవైతివా
కను మిఁక నాఁగఁజాలఁ దను ♦ కంబునఁ బ్రాణము లిత్తు నీకిటన్.
మ. తొలిజన్మంబున నుండి యెట్టియఘముల్ ♦ దోడ్తోడ నే తెంచెనో
ఇల నీసేవ లభించదయ్యె నకటా ♦ యీదేహ మింకేటి కో
జలజాతారివిభూషణా! యుసురులం ♦ జాలించి జన్మాయుతం
బులనైనన్ నినుఁ బొంది ధన్యత మహా ♦ మోదాంబుధిం దేలెదన్.
గీ. ఇటులఁ జింతించియును నాస ♦ యేపు నొంద
యింతి యుపవాసములఁ దపి ♦ యించుచుండ
మారుఁ దపసానమున నెట్టి ♦ మాయఁజేసి
పోయెనో కాని శంభుఁ డా ♦ పూన్కి మాని. 96
సీ. ఫణిభూషలను దీసి ♦ స్ఫటికాక్షమాలలు
గొన్ని మాత్రమె గీలు ♦ కొనఁగఁజేసి
వ్యాఘ్రేభచర్మము ♦ ల్వదలి పెట్టియు నొక్క
కృష్ణాజినంబు డా ♦ కేలఁదాల్చి
శూలాయుధాదుల ♦ నాలయమం దుంచి
యుభయదానప్రౌఢి ♦ నట్టె పట్టి

ఫాలాక్షమును గప్పి ♦ బాలచంద్రుని విప్పి
కనుదోయినే చల్ల ♦ దనము నుంచి
ఆ. కపటవటునిరూపు ♦ గైకొని శంభుండు
బిల్వవనమునందుఁ ♦ బ్రీతి మెఱయ
తన్నుఁగూర్చి కఠిన ♦ తప మాచరించెడు
నగతనూజ నేల ♦ నాత్మఁ దలఁచి. 97

మంజరి

ఫాలనేత్రుఁ డిటు బ్రహ్మచారియై - భామినికడ కేతెంచి
తాలిమితోఁ దనకై శ్రమలొందెడు - తన్వీమణిఁ దిలకించి
వ్రతచర్యకు నియమంబులకును స - ద్వర్తన కచ్చెరువొంది
అతివరూపలావణ్యములకు మది - నానందంబును బొంది
తనకుఁ దగినయిల్లాలని యెంతయుఁ - దనలోఁ దా నుప్పొంగి
కనికరించియును సరసమాడుటకుఁ - గడఁగి నంగి నంగి. 98

(నవరోజు) - (రూపకము)

బేలా - యీలీలను దప - మేలా చేసెదో
గోలా - చివురున దారువు - గోయఁ జూచెదో
మి. పూలసెజ్జ వీడనేల - భూమిపైఁ బరుండనేల
మేలిమిబంగారుబొమ్మ - మేలగునా యిది లెమ్మా
చ. ఏతలిదండ్రులు నినుఁగని - ఖ్యాతిఁ గాంచిరే
ఈతీరున నినుఁ గని వా - రెట్లు సైచిరే
మి. ఈతపంబు సేయుటకై - హేతువేమొ - వినఁదగునా
భీతనేత్రి! నీకు మంచి - పెనిమిటి గావలయునా
చ. పాఱఁజూడు మొక్కసారి - బ్రహ్మచారి నే
కోరిక కొనసాగె మంచి - కోడెకాఁడనే
మి. పేరు లేమ గాని గొప్ప - బేరకాఁడ నస్ఖలితుఁడ
మాఱెవ్వరు లేరు యొరుల - మాయలఁ బడ నీకె మగడ ॥బేలా॥
ఆ. తన్నుఁ జూచి యిట్లు ♦ తబ్బిబ్బులాడెడు
కపటవటునిచర్యఁ ♦ గాంచి గిరిజ

తామసించి శంకరుఁ ♦ దవిలి జంకియుఁ దాల్మి
దక్కి యిట్టు లనియె ♦ వెక్కసమున 100

(మోహన) - (చతురశ్ర)

పొమ్మా నీవు మఱి మాటలేల - యోపొల్లుమాటకారీ
దిమ్మరీఁడ! యిట్టిచర్యలకును మ - దిని సహింపఁజాలవెడలుఫీపో
ఘనతపంబుసేయుదానఁ గావున - కనికరించవలసె
కనుల కింత కానరాద పడుచులఁ - గినియసేయఁదగున నీతి లేదా
॥పొమ్మా॥

ద్విపద

ఈవిధిఁ బల్కుచు ♦ నింతి యావటుని
పోవది యేమని ♦ ముమ్మాఱు లనుచు
కనుమూయఁగా ♦ నీలగళరూపు దోఁచి
కనువిచ్చి చూడ నా ♦ కపటవటుండు
కనబడుచుండ నే ♦ కతమో యటంచు
తన కిట్టిమోహంబు ♦ దవిలినందులకు
పరిపరివిధముల ♦ భావించి చూడ
కరిచర్మమును గాల - కంఠమున్ మఱియ
భవ్యత్రిశూలమున్ - ఫాలనేత్రంబు
బాలచంద్రుండును - ఫణిభూషణములు
వెలుఁగొంద భక్తిచే ♦ వివశత్వ మొంది
పులకించి యష్టాంగ ♦ ములతోడ మ్రొక్కి
జయ కరుణామయ ♦ జయ జయామేయ
జయ సంతతావ్యయ ♦ జయ సదా విజయ
యనుచు వేవిధముల ♦ నాభవుం బొగడి
వినియతస్థలమందు ♦ వేంచేయఁ జేసి 101

మంజరి

అర్ఘ్యపాద్యముల నాచమనీయము - సందఁగఁ జేయుచును
దైర్ఘ్యకాలికంబై చెలంగు నా - ధవిత్రమున వీచుచును

తుమ్మిపూల నేకబిల్వదళముల - తోఁ బాదము లర్చించి
కమ్మనిఫలములఁ దినఁబెట్టుచు స - క్రమముగ నాతిథ్యము నిచ్చి
మోకరించి పాదసేవసేయఁగఁ - బులకలెత్తి పరశివుఁడు
ఓకమలేక్షణ ! యేకతమున ని - ట్లుంటివి నుడువు మనవుడు

భక్తికన్న మును బ్రీతియు లజ్జా - భావంబులు మెండయ్యెన్
యుక్తితోడ నచటు వాసి వేగమ - యుర్వీజము వెనుకయ్యెన్. 102

తపతిఁ మ్రొక్కుచు సర్వనాదులను మోదంబొప్పఁగాఁ జేయ భ
క్తపరాధీనత న్వ్యోమయానమున శ్రీ - కంఠుండు వేంచేసినన్. 103
చ. వలపలిచేయిఁ బట్టుకొని - వాణియు నిందిరసతీలలామ దా
పలిచెయిఁబట్టి మెల్లఁగ ను - పాయముసూప విమానరాజ మా
చలిమలపట్టి యెక్కె నుప - చర్యలుసేయుచు దేవజాలముల్
కలకలతూర్యనాదములు - గ్రమ్మఁగ నేగిరి సంతసంబునన్. 109
సీ. చనిచని హిమవంత ♦ మును జేరు సంతకు
మున్నె సప్తర్షులు ♦ మోదమెసఁగ
స్వస్వకులాంగనా ♦ సహితులై యచ్చటి
కరుదెంచి సంగతు ♦ లెఱుకసేయ
కల్యాణవస్తు సం ♦ గ్రహమును జేయించి
యిల్లు సింగారించి ♦ యెదురుచూచు
చున్న గట్టులజెట్టి ♦ యుత్సాహ మేపార
మ్రొక్కిన తనకూఁతు ♦ ముద్దుఁజేసి
ఆ. వచ్చినట్టిసురల ♦ వందనార్చనములఁ
బెద్దఁజేసి వరుని ♦ బ్రీతిఁ జూచి
పెండ్లికూఁతుఁ జేసి ♦ పెద్దలయాజ్ఞను
సార మొక్క మంచి ♦ సమయమందు. 105

కళ్యాణి - చతురశ్ర

ధారపోసెను దారికను సము - దారభావముతోడ ధూర్జటికి
దార తనతో నిలిచి జాహ్నవి - వారికలశముతోడఁ బోయ ॥ధా.

మి. సారసోద్భవుఁడు యాజ్ఞికుండయి-చతుర్వేదములను జదువుచుండ
కోరి సప్తఋషు లాశీర్వా - దక్షతలను నుడువుచుండఁగఁ జెలఁగ
చ. పంచభూతము లర్ఘ్యమందు త్రి - పాచరుఁడు సాక్షులైయుండఁగను
మించులను మఱపించునిర్జర - చంచలాక్షులుగూడి యాడఁగను
మి. ఎంచుచుఁ బూర్వాపరపురుషులు దరి -
యించిరి నాతో నిరువదొకండ్రని
మించిన సంతసమున నీశున కర్పించెఁ గల్యాణి ననురాగమెసఁగ॥

గీ. ఇటుల నగరాజు గౌరీమ ♦ హేశ్వరులకుఁ
బరమసంతోష మొప్ప వై ♦ వాహికంబుఁ
జేయఁ జేడలు మంగళ ♦ గేయములను
బాడి రీవిధి సురలు పు ♦ ష్పములు గురియ. 107

మంగళహారతి - సురట - (త్రిశ్రగతి)

మంగళములు మీకు సర్వ - మంగళామహేశులకు
మంగళరూపములఁ జెలఁగు - మాతాపితరులకు
మి. భంగము లెఱుఁగనివారు వి - పన్నులఁ గాచెడువారు
తుంగహృదయు లమితదయా - పాంగములను గనువారలు ॥మం॥
ఉభయులతపములకు మీ - రుభయులును సుఫలములు
అభయప్రదానశీలు - రన్ని సేయువారలు
మి. విభవంబుల నలరుదురు - వినయాత్ముల నేలుదురు
శుభచరితు లనంతునకును - సురట మీకనికరమే ॥మంగ॥

ఇది శ్రీపరమేశ్వరీకరుణాకటాక్షలబ్ధసారస్వతసంపన్నుండును, విశ్వామిత్రగోత్రోద్భవుండును, శ్రీరామకవచ కృష్ణయాఖ్యకవిపుత్రుండునగు అనంతభక్తునిచే రచియింపంబడిన పార్వతీపరిణయంబను భగవతీకథాసుధాసరోవరంబు సంపూరితంబు.



శ్రీపార్వతీపరమేశ్వరార్పణ మస్తు.

